# గ్రంథ పరిచయం

డాక్టర్ **బి.వి. రామన్** జ్యోతిష గ్రంథావళి

# అనుభవ ప్రశ్న జ్యోతిషము

## PRACTICAL HORARY ASTROLOGY

ఆంగ్ల మూలము

**గాయత్రీదేవి వాసుదేవ్**

తెలుగు అనువాదం

**పాలపర్తి శ్రీకాంత్**


ఈ గ్రంథం కావలసిన యెడల :

**మోహన్ పబ్లికేషన్స్**

**కోటగుమ్మం, అజంతాహోటల్ ఎదురుగా**

**రాజమండ్రి. 1. ఫోన్ : 2462565**

వెల రు. 50-00

# అనుభవ ప్రశ్న జ్యోతిషము

**Anubhava Prasna Jyotisham**

ఆంగ్ల మూలం : (ప్రాక్టికల్ హోరరీ ఎస్ట్రాలజీ)

గాయత్రీదేవి వాసుదేవ్

తెలుగు అనువాదం :

పాలపర్తి శ్రీకాంత్

ప్రథమ ముద్రణ :

1999

ముద్రణ :

ప్రచురణ కర్తలు

ఋషి ప్రచురణలు

**బి.వి.రామన్ గారి గ్రంథములు**

| | |
|---|---|
| జ్యోతిష విద్యారంభం | రూ. 50/- |
| గ్రహభావ బలములు | రూ. 50/- |
| కాలచక్రదశ | రూ. 50/- |
| అనుభవ ప్రశ్నాజ్యోతిషం | రూ. 50/- |
| జ్యోతిషశాస్త్రంలో -వాతావరణ భూకంపాలు | రూ. 50/- |
| భావార్థరత్నాకరం | రూ. 75/- |
| భారతీయజ్యోతిష సర్వస్వం | రూ. 75/- |
| అష్టకవర్గ పద్ధతిః | రూ. 75/- |
| పురోగామి జాతకం | రూ. 75/- |
| జ్యోతిష శాస్త్రంలో -సందేహాలు, సమాధానాలు | రూ. 75/- |
| ప్రశ్నతంత్ర | రూ. 75/- |
| ముహూర్తం | రూ. 75/- |
| విశిష్ట జాతకములు | రూ. 125/- |
| భారతీయఫలితజ్యోతిషం | రూ. 125/- |
| 300 ముఖ్యమైన యోగములు | రూ. 125/- |
| జాతకంపరిశీలించడంఎలా ? | రూ. 250/- |

సోల్ డిస్ట్రిబ్యూటర్స్ :

**మోహన్ పబ్లికేషన్స్**

**కోటగుమ్మం, అజంతాహోటల్ ఎదురుగా**

**రాజమండ్రి. 1. ఫోన్ : 2462565**

All rights reserved. No part of this Publication may be reproduced or transmitted in any from or by any means, electronic or mechanical including photocopying, recording, or any injuration storage and setrieval system, with permission in writting from the publisher.

# అనువాదకుని మనవి

ఋషులు జ్యోతిషాన్ని వేదాలకు నేత్రములుగా వర్ణించారు. అటువంటి జ్యోతిషాన్ని నిత్యజీవితంలో సాధారణ మానవుని సాధక బాధకాలకు సమాధాన మిచ్చేదిగా నిలిపింది ప్రశ్నభాగం.

నేటికాలంలో ప్రశ్న జ్యోతిషంలో అవిరళ కృషి జరిపిన వారిలో శ్రీమతి గాయత్రీదేవీ వాసుదేవ్ ప్రముఖులు. ఆమె శ్రీ బి.వి. రామన్‌గారి కుమార్తె. అంతకు మించివారి ఉత్తమ శిష్యురాలు. ప్రశ్న శాస్త్రాన్ని సాధారణమైన మనుష్యులకు కూడా అర్థమయ్యేలా ఆంగ్లంలో ఆమె వ్రాసిన

కు అనువాదమే ఈ పుస్తకం.

నేను జ్యోతిష శాస్త్రంలో ఒక సాధారణ విద్యార్థిని. నాకు తెలిసినది తక్కువ, జిజ్ఞాస ఎక్కువ. శ్రీ ఆకుల పవన్‌కుమార్‌గారి ప్రోత్సాహంతో నేను ఈ అనువాదం చేయటానికి సాహసించాను.

నా తల్లిదండ్రుల, గురుదేవుల, భగవానినుని ఆశీర్వచనబలంవల్ల ఈ అనువాదాన్ని పూర్తి చేయగల్గాను. గుణాలు గ్రంథకర్తవి. దోషాలు నావిగా మన్నింప ప్రార్థన. మీ ఆశీస్సులను నిర్మాణాత్మకమైన విమర్శలను సదా కోరుకుంటున్నాను.

ఇట్లు

**పాలపర్తి శ్రీకాంత్**

# ఆంగ్లములో తొలిముద్రణకు ముందుమాట

ప్రశ్న జ్యోతిషము నిత్య జీవితంలో ఉపయోగించినట్లుగా జీవతంలో మారేచోట ఉపయోగించదు. కాని ఈ జ్యోతిష శాఖ పూర్తిగా అధ్యయనం చేయబడలేదు. ప్రశ్న జ్యోతిషంపై ప్రాచీన గ్రంథాలఅనువాదాలు, వివరణలు మనకు నేడు లభిస్తున్నాయి. కాని ప్రశ్నలకు సమాధానం ఇవ్వటానికి తగిన పాఠ్య గ్రంథం లభ్యం కావటం లేదు.

ప్రాచీన గ్రంథాలలో కొన్ని రకాల గ్రహాల కలయికలు, ప్రశ్నలకు సరియైన సమాధానాలు ఇస్తాయని తెలియజేయబడింది. కాని ఈ యోగాలు అనుభవంలో చాలా తక్కువగా ఉంటున్నాయి. అందుచేత నేను మరింతగా అనుభవంతో సమాధానాలనిచ్చే గ్రహసంయోగాల గూర్చి వెదుక వలసి వచ్చింది. మొత్తం ప్రశ్న శాస్త్రాన్ని కొన్ని మూల సూత్రాలకు కుదించవచ్చని కనుగొన్నాను. ఈ సూత్రాలను ఏ ప్రశ్నా చక్రం చూడటానికైనా వాడవచ్చును.

నేను మొదట ప్రశ్న శాస్త్రాన్ని, నా తండ్రిగారు శ్రీ B.V.రామన్ ఆంగ్లంలోనికి అనువదించిన నీలకంఠుని "ప్రశ్నతంత్రం"తో ఆరంభించాను. తరువాత భట్టోత్పలుని "ప్రశ్నజ్ఞానం", "సప్తపంచాశిక" (ఈ రెండిటిని కీ॥శే॥ శ్రీ వి. సుబ్రమణ్య శాస్త్రి ఇంగ్లీషులోని అనువదించారు) నా తండ్రిగారి చేత అప్పుడు అనువాదం చేయబడుతున్న అరుదైన ప్రాచీన కేరళ ప్రశ్న గ్రంథము ప్రశ్నమార్గ (1 నుండి 16 అధ్యాయాలు) ను అధ్యయనం చేసాను. తిరిగి ప్రశ్న తంత్రం చదివాను. ప్రశ్నతంత్రాన్ని ఎన్నోసార్లు బాగా అధ్యయనం చేసి ఏ ప్రశ్నకైనా సమాధాన మివ్వగల ఒక మూలసూత్రాన్ని పట్టుకోగలిగాను. ఈ సూత్రం ఇద్దశాల యోగంలో ఉంది. ఇది గ్రహాల ఒక ప్రత్యేకమైన సంబంధం వల్ల ఏర్పడుతుంది. ఈ సరాఫ, కాంబూల, నక్త మరియు రద్ధ అన్న ఇతర యోగాలు ఈ యోగానికి విస్తరణలు, మినహాయింపులు మాత్రమే.

నా తండ్రిగారు జ్యోతిషంలో నా గురువు. నా గురువు గారితో నా జీవితం అంతా కలిసి ఉండే అరుదైన అవకాశం నాకు లభించింది. మా మధ్య ఇవి, అవి అని కాక ఈ భూమిపైని అన్ని విషయాలపై జ్యోతిశాస్త్ర రీత్యా చర్చలు జరిగాయి. ఆ చర్చలు దుస్తుల రంగులు, మార్క్సిజం, సాంఖ్యం, వివాహం, విజయం మరియు మరణానంతరం జీవితం గూర్చి ఉండేవి. ఈ చర్చలు జ్యోతిషంలో ఎన్నో పుస్తకాలు చదివినా లభించని అరుదైన అంతర్‌దృష్టిని నాకు ప్రసాదించాయి. కాని నేను నేర్చుకున్న విషయాలను ఎన్నో పుస్తకాల్లో నింపవచ్చు.

మా అమ్మగారైన శ్రీమతి రాజేశ్వరీ రామన్‌గారు కూడ నాకు గురువులే. వారు నన్ను ఎన్నో ప్రశ్న లేసేవారు. ఆ ప్రశ్నలు సూర్యుని క్రింద అన్నివిషయాలకు సంబంధించియుండేవి. వాటికి సమాధానం చెప్పటంకోసం నేను గ్రహాలతో జిమ్నాస్టిక్స్ చేయవలసి వచ్చేది. అది నాఫలితాలను వ్యాఖ్యానించే శక్తిని బాగా పెంచింది.

నేను ఈ పుస్తకంలోని పేజీలను నా గురువు గారి వద్ద నేర్చుకున్న విషయాలు, ఎన్నో చక్రాలను పరిశీలించిన అనుభవంతో నింపాను. ఈ పుస్తకాన్ని చదవటానికి జ్యోతిషాన్ని గూర్చిన సాధారణ జ్ఞానం, చక్రాన్ని వేయగల నేర్పు కావాలి. ఈ పుస్తకంలోని సూత్రాలను ఉపయోగించి చాలా ప్రశ్నలకు సమాధానం చెప్పటం సులభం. మంచి జ్ఞానాన్ని పొందాలనుకునే వారందరికీ ఈ పుస్తకం ఉపయోగిస్తుందని భావిస్తున్నాను.

ఈపుస్తకాన్ని అందంగా ముద్రించటంలోను, ప్రూఫ్‌లు దిద్దటంలోను సహకరించిన నా సోదరుడు నిరంజన్ బాబు, శ్రీ సుప్రజా రామ్‌కు నా ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

25-03-1979 **గాయత్రీదేవి వాసుదేవ్**

# ఆంగ్లంలో నాలుగవ ముద్రణకు తొలిపలుకు

ప్రశ్న శాస్త్రము జ్యోతిష శాస్త్ర విషయాలలో చాలా సులభమైనది. పృచ్ఛకుడు అడిగిన అత్యవసర విషయాలకు సమాధానాలు ఇవ్వటంలో చాలా పేరుగలిగింది.

మూడో ముద్రణను ప్రజలు ఎంతో ఇష్టంగా స్వీకరించారు. అందుచేత నాలుగవ ముద్రణ వెంటనే అవసరం అయ్యింది.

01-02-1992 **గాయత్రీదేవి వాసుదేవ్**

# ఉపోద్ఘాతం

"Practical Horary Astrology" కు ఉపోద్ఘాతం వ్రాయటం నాకు చాలా ఆనందాన్ని కల్గిస్తోంది. గ్రంథకర్త గాయత్రీదేవి వాసుదేవ్ నా కుమార్తె. ఆమె జాతక భాగాన్ని ప్రశ్న భాగాన్ని బాగా అధ్యయనం చేసింది. ప్రశ్న చక్రాన్ని సరిగా వ్యాఖ్యానించటంలో చాలా అనుభవాన్ని, ఆస్ట్రలాజికల్ మ్యాగజైన్‌లో చాలా రోజుల నుండి వ్యాసాలు వ్రాస్తూ మంచి పేరును సంపాదించింది.

ఫల జ్యోతిషంలో ప్రశ్న భాగం చాలా ముఖ్యమైనది. ఇందులో సరియైన వివరాలతో చక్రం వేస్తాము. అంతేకాక ఫలితాలను తొందరగానే సరిచూచుకోవచ్చు. ప్రశ్న జ్యోతిషం, జాతక భాగం కంటే చాలా ఉపయోగకరమైనది. ఇది సాధారణ ప్రజలు నిత్యం ఎదుర్కొనే ముఖ్యమైన ఇబ్బందులకు సమాధానాలు ఇస్తుంది.

నా కూతురు ఈ పుస్తకాన్ని చక్కని విషయ జ్ఞానంతోను, నైపుణ్యంతోను వ్రాసింది. విషయాన్ని చక్కగా, సులభంగా అర్థమయ్యే రీతిలో వివరించింది. ఉదాహరణలు అన్ని కూడా ఆమె అనుభవం లోనివే.

ఎంతోకాలం నుండి ప్రశ్నాజ్యోతిషంకు సంబంధించిన, అనుభవానికి ప్రాధాన్యతనిచ్చే, జనుల భాషలో వ్రాయబడిన గ్రంథం యొక్క అవసరం వుంది. ఈ అవసరాన్ని నా కూతరు తీర్చటం నాకు సంతోషంగా ఉంది.

ఈ పుస్తకం జ్యోతిషశాస్త్ర ప్రారంభకులకే కాక, శాస్త్ర జ్ఞానం కల్గిన విద్యార్థికి, జ్యోతిష్కులకు చాలా ఉపయోగకరమైనది.

భవిష్యత్తులో నా కుమార్తె తను స్వతంత్రంగా మరెన్నో పుస్తకాలను వ్రాస్తుందని, అందులో నేనింతవరకు వ్రాయని దృష్టలగూర్చి వివరణలు ఇవ్వగలదని నేను భావిస్తున్నాను.

ఆమెకు ఆయుష్షు ప్రజలకు ఉపయోగపడే మంచి జీవితం, కలగాలని నేను మనసారా ఆశీర్వదిస్తున్నాను.

29-3-1979

బి.వి. రామన్

## విషయసూచిక



–××××–

# జ్యోతిశ్శాస్త్ర శాఖలు

జ్యోతిషము 3 భాగాలు. 1) ఫలజ్యోతిషము 2) సంహిత జ్యోతిషము 3) ముహూర్త జ్యోతిషము.

ఫల జ్యోతిషము భవిష్యత్తులో జరుగు శుభాశుభములను వివరిస్తుంది. ఫలజ్యోతిషము జాతక భాగం, ప్రశ్న భాగమని రెండు విధములు. జాతక భాగం, ప్రశ్న భాగమని రెండు విధములు. జాతక భాగం జన్మకాలీన గ్రహ, భావ బలములు ఆదారంగా, ప్రశ్నభాగం ప్రశ్న కాలచక్రముననుసరించి ఫలితాలను చెబుతాయి. చక్రంలోని అన్ని విషయాలను జాగ్రత్తగా పరిశీలించినట్లైతే, జాతక భాగం, ప్రశ్న రెండూ సరైన ఫలితాలనే ఇస్తాయి.

ప్రస్తుత గ్రంథ విషయం ప్రశ్న జ్యోతిషము. సంహిత భాగం ద్వారా దేశాల శుభాశుభాలను, భూమండలం పై సంభవించు సమిష్టి శుభాశుభాలను తెలుసుకోవచ్చు.

ముహూర్త జ్యోతిషం ఫలజ్యోతిషమునకు వ్యత్యయం. ఇందులో ఒక కాలాన్ని ఎన్నుకుని, అందుకు చక్రాన్ని ఏర్పరచి ఆ కాలంలో చేసే పని మంచిగా జరిగేలా చూచుకుంటాము.

జన్మకాలం తెలియనప్పుడు ఒకవేళ తెలిసినా సరియైనది కానప్పుడు జన్మచక్రం నుండి సరైన ఫలితాలను తెలుసుకోవటం చాలా కష్టం. ఈ సమయంలో ప్రశ్నచక్రం మంచి ఫలితాలను ఇస్తుందని గొప్పపేరు. కాని జాతక చక్రం ద్వారా జాతకుని మొత్తం జీవితాన్ని గూర్చి చెప్పవచ్చు. ప్రశ్న చక్రం ద్వారా పృచ్ఛకుడు అడిగిన ప్రశ్నకు మాత్రమే సమాధానం చెప్పగలం.

జాతకభాగం, ప్రశ్నభాగం రెండూ రాశులు, రాశిశీలాలు, భావాలు మరియు భావాధిపతుల విషయంలో ఒకటే దృష్టుల విచారణ, ఫలనిర్ణయం విషయంలో మాత్రమే రెంటి మధ్య తేడా ఉంది.

## రాశి శీలములు

జ్యోతిశ్శాస్త్ర విద్యార్థి రాశులు, వాటి ఆధిపత్యములు, గ్రహాలు, గ్రహశీలములు, భావాలు మరియు అవి సూచించు విషయాలపై చక్కని పరిజ్ఞానం కల్గియుండాలి.

జ్యోతిశ్చక్రమునందు 12 రాశులు ఉన్నాయి. అవి

1) మేషము ♈ 2) వృషభము ♉ 3) మిధునము ♊
4) కర్కాటకము ♋ 5) సింహము ♌ 6) కన్య ♍
7) తుల ♎ 8) వృశ్చికం ♏ 9) ధనస్సు ♐
10) మకరం ♑ 11) కుంభము ♒ 12) మీనము ♓

| | | | |
|---|---|---|---|
| ♓ | ♈ | ♉ | ♊ |
| ♒ | | | ♋ |
| ♑ | | | ♌ |
| ♐ | ♏ | ♎ | ♍ |

**మేషము :** మేషం అగ్నితత్వం, నిర్జల చరరాశి. శిరస్సు, అడవి, పశువులను మేపు ప్రదేశాలు, కొండ ప్రాంతాలు, లోకప్పు, గుర్రపు శాల, తూర్పు, ఇటుక బట్టీలు, కమ్మరి మొదలైన విషయాలు దీని ఆధీనంలోనివి. ఇందు జన్మించిన వారు మరీ ఒత్తులేని జుట్టు, విశాలమైన నుదురు, దట్టమైన కనుబొమ్మలు, కల్గి ఎత్తుగాను, సన్న

గాను ఎండినట్లుగా కన్పిస్తారు. వీరి చర్మం పలుచగా ఉండి ఎర్రని మచ్చలను కల్గియుంటుంది. వీరిలో నాయకత్వ లక్షణాలు, అధికారం చెలాయించే గుణం ఉంటాయి. వీరిలో తీవ్రత, ఆవేశం అనాలోచన లోపాలు ఎక్కువ, సంయమనం తక్కువ.

**వృషభం :** ఇది భూతత్వం, స్థిరరాశి, ముఖం, పొలాలు, పచ్చిక బయళ్ళు, మైదానాలు, గోశాల, పల్లపుగదులు, మేడక్రింది భాగం, పూల పొదలు, భోగమందిరం, భోజనశాల, ఈ రాశికి చెందినది. ఈ రాశి వారు అందంగాను పెద్ద చెక్కిళ్ళు, కొద్దిగా చప్పిడి ముక్కు, ఎత్తుకు తగ్గ లావు, లావైన మెడ, నల్లని ఒత్తైన జుట్టు, చక్కని పలువరుస, పెద్ద కళ్ళు కల్గియుంటారు. వీరు నెమ్మదైన నడవడికల్గి, సుఖాసక్తితో ఉంటారు. వీరికి హఠాత్తుగా కోపం వస్తుంది. అంత తొందరగా శాంతించరు. వీరు ఇష్టపడితే నమ్మకస్తులుగాను, వినయ విధేయతలు కల్గియుంటారు.

**మిధునము :** మిధునం వాయుతత్వం, ద్విస్వభావరాశి, కంఠం, ఛాతి, శయన మందిరాలు, గోడలు, గచ్చు, పెద్ద పెట్టెలు, కాండము, విద్యాలయములు, చదువుకొనే గదులు, విద్యుత్ ఎలక్ట్రానిక్ పరికరములు, సమాచార విభాగానికి సంబంధించిన వైర్లు, టెలీఫోన్లు, రేడియో, టీ.వీ.లు, వార్తాపత్రికలు మొదలైనవి ఈ రాశి ఆధీనము లోనివి. ఇందు జన్మించినవారు పొడవుగా, చక్కని శరీర సౌష్ఠవం, నిండైన ముఖం, బుగ్గలు కల్గియుంటారు. చక్కని చర్మ సౌందర్యం, నిగారింపు గల జుట్టు, విశాలమైన ఛాతి కూడ కల్గియుంటారు. వీరిలో హాస్య ప్రియత్వం, ఉత్సుకత, జ్ఞానాసక్తి, చమత్కారం, పరిశీలన మనస్సు తొందరగా మార్చుకునే లక్షణాలు ఉంటాయి.

**కర్కాటకం :** ఇది జల, చర రాశి హృదయం, చన్ను, నీరు నిండిన పొలాలు, చిన్నయేర్లు, జలపాతాలు, నదులు, కాలువలు, ప్రాంతీయ రవాణా, నూతులు, నీళ్ళ తొట్టె, కందకాలు, అగడ్తలు,

వంటగది, ఇళ్ళు, బేకరీలు, కుళాయిలు, ఆహార పదార్థాలు నిలువ ఉంచు ప్రదేశాలు, చిరుతిళ్ళు అమ్మే దుకాణాలు మొదలగునవి ఈ రాశి అధికారంలోనివి. చిన్నదైన ఆకృతి, నిండైన ఆకర్షణీయమైన ముఖ కవళికలు, కళ్ళు మృదువైన గిరజాల జుట్టు, అవయవపుష్టి, అనురాగం, క్షమాగుణం, సున్నితమైన మనస్సు, ఇతరుల తప్పులను మరుచుట అనే స్వరూప స్వభావాలను ఈ రాశివారు కల్గియుంటారు. అన్ని సంబంధాల లోను తల్లి వలే వ్యవహరిస్తారు.

**సింహం :** ఈ రాశి అగ్నితత్వం, స్థిరరాశి ఇది పొత్తికడుపు, జీర్ణవయవములు, బొడ్డు, పర్వతాలు, అరణ్యాలు, గుహలు, రాతి ప్రదేశాలు, ఎడార్లు, రాజమందిరాలు, ఉద్యాన వనాలు, కోటలు, అగ్ని ఉండే ప్రదేశాలు, పొగగొట్టం, కాగులు, వేడిని పుట్టించే పరికరకాలు, ఇనుము, ఉక్కు కర్మాగారములు మొదలైన వాటిపై అధికారం కల్గి యుంటుంది. ఇందు జన్మించినవారు సన్నగాను, వేడితత్వం గల్గియుంటారు. శరీరం కంటే తల పెద్దదిగా ఉంటుంది. కాళ్ళు, దవడలు ప్రత్యేకంగా కనిపిస్తాయి. అవయవాలు అంత ఆకర్షణీయంగా లేనప్పటికీ, శరీరంలో రాజఠీవి ఉట్టిపడుతూ ఉంటుంది. వారియందు వారికి విశ్వాసం ఎక్కువ. కొద్దిపాటి అలక్ష్యము కూడ భరించలేరు. ఇతరులపై అధికారం చేయటానికి, ఆజ్ఞలు ఇవ్వటానికి పుట్టామని భావిస్తారు. కాళ్ళు సన్నగా ఉండి నడుం భాగం పెద్దగా ఉంటుంది.

**కన్య :** భూతత్వం, ద్విస్వభావం : తుంటి, జీర్ణకోశం, కాలేయం, నీరు నిండిన పొలాలు, కాలువలు, పచ్చని ఉద్యానాలు, పళ్ళతోటలు, జొన్నచేలు, సమృద్ధి, గ్రంథాలయాలు, పుస్తకాల దుకాణాలు, పాలఉత్పత్తులు అమ్మే ప్రదేశాలు. తేనె, పంటపొలాలు, వాటిని ఆనుకొని ఉండు ఇళ్ళు. కుటీర ఉత్పత్తులు మొదలగునవి ఈ రాశి ఆధీనములోనివి. ఈ రాశి వారు మిగిలిన అన్ని రాశుల వారికంటే

అందంగా కన్పిస్తారు. లేడి కన్నుల వంటి కళ్ళు, విల్లులా వంగిన కనుబొమ్మలు, చిన్ని నోరు, తెల్లని వరుసైన పలువరుస, కొనతేరిన గడ్డం, లావయ్యే శరీరం కల్గియుంటారు. వీరు ఇతరులతో త్వరగా కల్సిపోతారు. తెలివైనవారు, చురుకైనవారు, మంచి వక్తలు, తొందరగా ధైర్యం కోల్పోతారు. శ్రద్ధగా కష్టపడతారు. శరీర బలం తక్కువ పొదుపైన అలవాట్లు కల్గి రోత పుట్టించే సన్నివేశాల నుండి విచక్షణ, చతురతతో తప్పించుకునే నేర్పు కల్గియుంటారు.

**తుల :** చరం, వాయుతత్వం : పొత్తి కడుపుకు, తొడలకు మధ్య ప్రదేశం వ్యాపారి, విఫణి, క్రయవిక్రయాలు జరిగే ప్రదేశం, బ్యాంకులు, వినోదం కల్గించు ప్రదేశాలు. బహిరంగంగా జరిగే వేడుకలు, ఉత్సవాలు, అలంకారగృహాలు, స్నానాల గదులు, మరుగు గది, నీటితొట్టెలు, అంతస్తులతో కూడిన కట్టడాలు, మొదలైనవి ఈ రాశివి. ఈరాశిలో జన్మించినవారు తేజోవంతమైన రూపాన్ని కల్గియుంటారు. స్థిరమైన బుద్ధి, చిన్నవిషయాలకే హైరానాపడే స్వభావం కల్గియుంటారు. వీరు వక్తలుకాని కొన్నిసార్లు మూర్ఖంగా, అనాలోచితంగా, కఠినంగా మాట్లాడతారు. వీరి శరీరం సొగసుగా, సన్నగా ఉంటుంది. చర్మంపై మొటిమలుగాని, పుట్టుమచ్చలుగాని ఉంటాయి.

**వృశ్చికం :** స్థిరం, జలరాశి : రహస్యావయవములు, రంధ్రము, లోతైన గుహలు, బీటలు, పగుళ్ళు, గనులు, నేలమాళిగలు, గారేజీలు, కార్ పార్కింగులు, అడుగుభాగం, మురికి కాలువలు, చిత్తడి నేలలు, పాడు పడినది, చెత్తకుప్పలు, మురికి నీళ్ళు, బీడు భూములు, బీరువాలో క్రింది అరలు, మొదలగునవి ఈ రాశి ఆధీనంలోని విషయాలు. ఈ రాశివారు చిన్నదైన, చక్కని సౌష్టవం కల్గిన శరీరం, దట్టమైన ఉంగరాల జుట్టు, ఇతరులను ఆకర్షించే కళ్ళు, వంగిన కాళ్ళు, కల్గియుంటారు. తొందరగా నొచ్చుకుంటారు. చెడు భావాలకు దగ్గరౌతారు. స్నేహితునికి ప్రాణమిస్తారు. శత్రువు ప్రాణం తీస్తారు.

ప్రజల నుండి, గుంపుల నుండి దూరంగా ఉండటం ఇష్టం. ముక్కు సూటి స్వభావం, సులభంగా కోపం వస్తుంది. చిరచిరలాడు తుంటారు.

**ధనస్సు :** ఈ రాశి ఆధీనంలో తొడలు, రాజ ప్రభుత్వ గృహాలు, ప్రభుత్వ కార్యాలయాలు, ఆయుధశాలలు, పందెపు భూములు, జూదగృహాలు, గృహంలో పై అంతస్తు, గుర్రాలను పెంచు ప్రదేశాలు, పందెపు గుఱ్ఱాలు, వాహనాలు, విమానాలు మొదలగునవి ఉన్నాయి. ఈ రాశి వారిలో లావుగా, పెద్దగా ఉండే భుజస్కంధాలు, వంపులు తిరిగిన కండరాలు, సూటైన ముక్కు, లోతైన కళ్ళు, పలుచని జుట్టు, పెద్ద పిక్కలు, తొడలు గల్గిన శరీర సౌష్టవం ఉంటుంది. పనుల్లో నీతి, నిజాయితీ గల్గియుంటారు. వారిని రెచ్చగొట్టనంత వరకూ సరదాగా ఉంటారు. మంచి స్వభావం, తను సంతోషంగా ఉంటూ, ఇతరులను సంతోషంగా ఉంచుతారు. ఎన్నో సాహసాలు చేస్తారు. అపాయాలతో సహవాసం చేస్తారు. పుట్టుకతో "కాయ్ రాజా కాయ్" అనే స్వభావం కల్గియుంటారు. ఈ రాశిది ద్విస్వభావం, అగ్నితత్వం.

**మకరం :** మకరం చరరాశి, భూతత్వం : మోకాళ్ళు. మృగాలు సంచరించే నీటి తావులు, మొసలి, ఆక్వేరియంలు, చేపలు పట్టే వలలు, గోశాలలు, పనికిరానిసామాన్లు ఉంచే ఇళ్ళు,ముళ్ళు, పొదలు, లోతట్టు భూములు, మొదలగునవి ఈ రాశి ఆధిపత్యంలోని విషయాలు. ఈరాశివారు పొడవైన మెడ, చిన్నతల, గంభీరమైన చూపులు, సన్నదైనశరీరం కల్గినవారు. చమత్కారులు, మారే స్వభావం కల్గియుంటారు. ప్రతివిషయంలోను పరిపూర్ణత సాధించాలనుకుం టారు. పద్ధతిగా పనులు చేయిస్తారు. స్వభావంలో జాగ్రత్త, గోపనం ఉంటాయి. సాధించాలన్న తపన, పట్టుదల, వ్యవహార దక్షత కల్గియుంటారు.

**కుంభం :** ఇది స్థిరరాశి, వాయుతత్వం. ఈరాశి పిక్కలు, కుమ్మరి,కొలిమి,సత్రాలు, చలువరాళ్ళు, రాళ్ళుకొట్టుగనులు, ప్రయోగ శాలలు, విధ్యాబోధనచేసే గదులు, జలప్రవాహాలు, పర్వత ప్రవాహాల మూలస్థానం మొదలగు వాటిపై ఆధిపత్యం కల్గియుంటుంది. ఈ రాశివారు పొడవుగా, ఎముకలు కన్పిస్తూ ఉంటారు. గుండ్రటి ముఖం, చిన్నకళ్ళు, చిన్ననోరు, సరిగాలేని పలువరుస కల్గియుం టారు. జుట్టు మోటుగా, శుభ్రత లేకుండా ఉంటుంది. కష్టపడి పనిచేసే తత్వం, ఆధ్యాత్మికతవేపు మొగ్గు ఉంటుంది. సుఖదుఃఖాలు పట్ల ఆసక్తి ఉండదు. అందుచేత సంయమనం కోల్పోరు. నిజాయితీ, ఇతరులకు మంచి చేసే స్వభావం కల్గియుంటారు.

**మీనం :** మీనం ద్విస్వభావం జలతత్వ రాశి : పొలాలు, సముద్రాలు, అఖాతాలు, ఆస్పత్రులు, కారాగారాలు, ప్రసూతి వార్డులు, నర్సుల నివాసాలు, మధ్యం తయారు చేయు ప్రదేశాలు, పానశాలలు, అపకీర్తి ప్రదేశాలు, ముని ఆశ్రయాలు, సభలు, నీటిపీపాలు, కాఫీ, టీ దుకాణాలు, ఐస్‌క్రీమ్ షాపులు మొ॥ ఈ రాశి ఆధీనంలోనివి. ఈ రాశివారు పొట్టిగా, లావుగా అందమైన ముఖాలు కల్గి పెద్దకళ్ళు గోధుమ వర్ణంలోగాని నీలంరంగులోగాని ఉంటాయి. గాలికి కదులుతూ ఉండే జుట్టు, పెద్ద కనుబొమ్మలు, మంచి పలువరుస, నాజూకైన శరీరం, నెమ్మదైన నడక కల్గియుం టారు. బద్ధకస్తులు, భావావేశం ఎక్కువ, పిరికివారు, సంశయాత్మ కులు. నిజాయితీ, మంచి ఆహారం, పరిసరాలను ఇష్టపడేవారు, ఎక్కువ మాట్లాడేవారు, అంతర్‌దృష్టి, ఆత్మశక్తి కల్గి ఇతరుల మనసు లోని విషయాలను తెలుసుకోగల్గుతారు. భవిష్య జ్ఞానం ఉండవచ్చు.

రాశిశీలములు, ఆ రాశుల అధిపతులు ఉన్నస్థానాన్ని అనుస రించి, రాశుల యందున్న గ్రహాలు, దృష్టులు ఆధారంగా మారతాయి. ఈ విషయాలపై చక్కని అవగాహన కల్గితే ఫలితాలను కచ్చితంగా చెప్పగలము.

# భావకారకత్వములు

జ్యోతిశ్చక్రం 360 భాగాలు గల్గి ఒక్కొక్కటి 30 భాగాలు కల్గిన 12 రాశులుగా విభజించబడినది. లగ్నం మొదటి భావము మిగిలిన భావాలు ఒకదాని వెంట మరొకటి వస్తాయి. హిందూ జ్యోతిషాన్ని అనుసరించి ఈ పండ్రెడు రాశులు లేదా భావాలు, మానవ జీవితం లోని వివిధ విషయాలపై ఆధిపత్యం కల్గియుంటాయి.

**లగ్నము :** పృచ్ఛకుడు, శరీరం, శరీర నిర్మాణం, ఆరోగ్యం, బలం, అవయవాలు, జన్మభూమి, ముదిమి, సంతోషం, దుఃఖం, గౌరవం, రాజనీతి, శాంతి, ఆయుర్ధాయం, కేశములు, గర్వం, జీవనం, చర్మం, జ్ఞానం, లోభత్వం, పౌరుషం, అహంకారం, అసంతృప్తి, పశువులు, బంధుజనుల నుండి అపవాదం, వినయం, ప్రశ్నించిన వస్తువు స్థితి, సముద్రయానం, ఆరోగ్యస్థితి, చిత్తం, మొదలైనవి ఈ భావం తెలియజేస్తుంది.

| | |
|---|---|
| 2వ భావం నుండి 12 వదిగా | –కుటుంబము, ఆహారం పోగొట్టుకొనుట |
| 3వ భావం నుండి 11 వదిగా | – సోదరుల, మిత్రుల లాభాలు |
| 4వ భావం నుండి 10 వదిగా | –తల్లి గౌరవం, ఇల్లు, సమాజంలో స్థితి |
| 5వ భావం నుండి 9 వదిగా – | సంతానం యొక్క ప్రయాణాలు, అదృష్టం |
| 6వ భావం నుండి 8 వదిగా – | శత్రువుల ఋణగ్రహీతల బాధలు |
| 7వ భావం నుండి 7 వదిగా – | కళత్ర ఆరోగ్య విషయాలు రూపం, అలవాట్లు, ఇష్టాలు |
| 8వ భావం నుండి 6 వదిగా – | కళత్ర కుటుంబము, బంధువుల రోగము |
| 9వ భావం నుండి 5 వదిగా – | తండ్రి యొక్క అదృష్టం |
| 10వ భావం నుండి 4 వదిగా | –ఉద్యోగ విషయాలు, ఉద్యోగంలో ఎక్కవలసిన మెట్లు |

11వ భావం నుండి 3 వదిగా -ప్రయాణాలు, స్నేహితుల ఏకోదరులు

12వ భావం నుండి 2 వదిగా -ఆస్పత్రి బిల్లులు, కోర్టు ఫీజులు, ఖర్చులు తెలుస్తాయి.

**ద్వితీయ భావం :** ధన స్థానం, భుజించుట, ఆస్తులు, నేర్చు కొనుట, ఆహార పానీయములు, కుడికన్ను ముఖము, చరాస్థులు, లేఖలు, పత్రాలు, వాక్కు, కుటుంబం, మత విశ్వాసం, గోళ్ళు, ముక్కు, నాలుక, అప్పిచ్చిన ధనం, ఈ భావం ద్వారా తెలుస్తాయి.

1వ భావం నుండి 2 వదిగా -ధన సంబంధమైన వ్యవహారాలు

3వ భావం నుండి 12 వదిగా - సోదరుల, ఇరుగు పొరుగు వారుల నష్టాలు, ఆస్పత్రుల యందు చేర్చుట, చెరసాలకు వెళ్ళుట

4వ భావం నుండి 11 వదిగా - తల్లి సాంఘీక కార్యకలాపములు, లాభాలు

5వ భావం నుండి 10 వదిగా- సంతానం యొక్క ఉద్యోగ విషయాలు, గౌరవం, విద్యాలయాల్లో వారి చదువులలో గొప్పతనం

6వ భావం నుండి 9 వదిగా - తల్లివైపు బంధువుల ప్రయాణాలు

7వ భావం నుండి 8 వదిగా - కళత్రం ద్వారావచ్చు మరణానంతరం సంక్ర మించే ఆస్థులు

8వ భావం నుండి 7 వదిగా - కళత్రమరణం

9వ భావం నుండి 6 వదిగా - తండ్రి, గురువుల అనారోగ్యం, అప్పులు, శత్రు వులు

10వ భావం నుండి 5 వదిగా - ఉద్యోగమందు పెట్టుబడి, ఆలోచన

11వ భావం నుండి 4 వదిగా - మిత్రుల ఇళ్ళు
12వ భావం నుండి 3 వదిగా - రహస్యశత్రువుల దగ్గరి ప్రయాణాలు తెలుస్తాయి.

**తృతీయ భావం :** ఈ భావం వల్ల కుడిచెవి, ధైర్యం, వీరత్వం, సోదరుడు, యుద్ధం, కాళ్ళు, మనస్సు, చలించుట, భటులు, చలనం, చిన్నప్రయాణాలు, బంధువులు, ఉత్తర ప్రత్యుత్తరాలు, ఆస్థి పంపకాలు, దాసీజనం, ఇరుగు పొరుగువారు మొ॥ తెలుస్తాయి.

2వ భావం నుండి 2 వదిగా - కుటుంబ ధనం
4వ భావం నుండి 12 వదిగా - తల్లి యొక్క నష్టాలు, కలలు, బంధనం, ఆస్పత్రు లలో చేరుట, మరియు రహస్య ప్రయోగాలు
5వ భావం నుండి 11 వదిగా - సంతానం లాభాలు
6వ భావం నుండి 10 వదిగా - శత్రువుల వృత్తి ఉద్యోగాలు, సంఘంలో గౌరవం
7వ భావం నుండి 9 వదిగా - కళత్రము లేదా భాగస్వామి యొక్క తండ్రి, వారి దూరప్రయాణాలు, మతసంబంధ విషయాలు
8వ భావం నుండి 8 వదిగా - నూతనోత్సాహం, దురదృష్టం, ఆటంకాలు తొలగుట
9వ భావం నుండి 7 వదిగా - తండ్రి యొక్క వ్యాపార భాగస్వామ్యం
10వ భావం నుండి 6 వదిగా - వృత్తి, హోదాకు సంబంధించిన కోర్టు వ్యవ హారములు
11వ భావం నుండి 5 వదిగా - మిత్రుల సంతానం తెలుస్తాయి

**చతుర్ధ భావం :** ఇల్లు, భూమి, మేనమామ, మేనల్లుడు, వాహనం, తల్లి, ఆవు, గనులు, పోయిన వస్తువులు, దున్నపోతు,

రాజ్యం, సుగంధ ద్రవ్యాలు, వస్త్రాలు, ఆభరణాలు, నీరు, వంతెన, నది, కాలువలు, విద్య, పాఠశాల, చిన్న పడవలు, మంచి పేరు, పాలు, గుడారాలు భూదానం, ఉద్యానవనాలు, బావులు, తటాకాలు తవ్వుట, ఆలోచన యందు స్పష్టత, తడిసిన భూమి వల్ల పుట్టే వరి మొదలైన పైర్లు, పోయిన వస్తువులకు సంబంధించిన ఆచూకీ ఈ భావం వల్ల తెలుస్తాయి.

5వ భావం నుండి 12 వదిగా – స్పెక్యులేషన్ నందు నష్టం
6వ భావం నుండి 11 వదిగా – శత్రువుల లాభాలు, మేనమామ మిత్రులు
7వ భావం నుండి 10 వదిగా – కళత్రం యొక్క ఉద్యోగం, సంఘంలో గౌరవం
8వ భావం నుండి 9 వదిగా – లాటరీ ద్వారా అదృష్టం కలసి వచ్చుట
9వ భావం నుండి 8 వదిగా – తండ్రికి వారసత్వంగా సంక్రమించిన ఆస్థి
10వ భావం నుండి 7 వదిగా – కళత్రం యొక్క సహోద్యోగులు
11వ భావం నుండి 6 వదిగా – మిత్రుల శత్రువులు, ఋణాలు
12వ భావం నుండి 5 వదిగా – తన శత్రువుల పిల్లలు, స్పెక్యులేషన్‌లో వారి లాభం తెలుస్తాయి.

**పంచమ భావం :** పనిముట్లు, పన్నులు మంత్రులు, తెలివి తేటలు, పిల్లలు – ప్రత్యేకించి పుత్రుడు, పొత్తికడుపు, సాంప్రదాయ నష్టాలు, నీతి, ప్రేమ వ్యవహారాలు, భావావేశం మంత్రం, తండ్రి యొక్క శుభకార్యాలు, గర్భం, నపుంశకత్వము, గర్భదానము, స్పెక్యులేషన్, వస్త్రాలు, ముందుచూపు, వంశపారంపర్య పదవి ఈ భావం వల్ల తెలుస్తాయి.

4వ భావమునకు 2 వదిగా – తల్లి నుండి ఆదాయం, ఆస్థులు, వాహనాలు, భూములు.

3వ భావమునకు 3 వదిగా – సోదరుని మిత్రులు, పొరుగువారు, వారి ప్రయాణాలు

2వ భావమునకు 4 వదిగా – కుటుంబ ఆస్థులు, కార్లు, గృహము నందు శాంతి సంతోషాలు

11వ భావమునకు 7 వదిగా – సహోద్యోగులతో సంబంధాలు

10వ భావమునకు 9 వదిగా – ఉద్యోగమునందు ఇబ్బందులు, ఆటంకాలు, నష్టాలు

9వ భావమునకు 9 వదిగా – తాత

8వ భావమునకు 10 వదిగా – కళత్ర కుటుంబం యొక్క సాంఘిక హోదా

7వ భావమునకు 11 వదిగా – వ్యాపార భాగస్వామ్యం ద్వారా లాభాలు

6వ భావమునకు 12 వదిగా – రహస్య శత్రువుల రహస్య కార్యకలాపాలు, పనివారల నష్టం తెలుస్తాయి.

**షష్ఠ భావం :** అప్పులు, చేతులు, దొంగలు, దొంగతనము, వ్రణము, రోగము, శత్రువు, తండ్రి వైపు బంధుత్వాలు, కఫము, వాపు, మశూచి, పాపకార్యములు, భయం, అవమానం, ఉగ్రకర్మలు, పిచ్చి, ఉన్మాదం, మనోభావం, అకాల భోజనం, బంధువుల నుండి కష్టాలు, మూత్రదోషాలు, అతిసారం, అపవాదం, చెరసాలలు, సేవ, సోదరులతో మనస్పర్ధలు, సేవకుడు, ఈ భావం వల్ల తెలుస్తాయి.

5వ భావమునకు 6 వదిగా – సంతానం యొక్క కుటుంబం

4వ భావమునకు 3 వదిగా – తల్లివైపు మేనమామలు, మేనత్తలు

3వ భావమునకు 4 వదిగా – ఇరుగు పొరుగు వారల ఆస్థులు

2వ భావమునకు 5 వదిగా – కుటంబ వ్యాపారం, వాక్కు,గానం వల్ల అదృష్టం

12వ భావమునకు 7 వదిగా - రహస్య శత్రువుల కళత్రం, వ్యవహారములు
11వ భావమునకు 8 వదిగా - మిత్రులకు వీలునామా ద్వారా సంక్రమించిన ఆస్థి
10వ భావమునకు 9 వదిగా - అధికారిక ప్రయాణాలు,బదిలీలు, ఇతరులకు సహాయముగా వెళ్ళుట
9వ భావమునకు 10 వదిగా - తండ్రి యొక్క ఉద్యోగం
8వ భావమునకు 11 వదిగా - మిత్రుల మరణం
7వ భావమునకు 12 వదిగా - కళత్రంయొక్క రహస్యశత్రువులు, వారి వ్యవహారాలు తెలుస్తాయి.

**సప్తమ భావం :** కళత్రం, కామం, వివాహం, వ్యభిచారం, ప్రధానం, భాగస్వామి, ఉద్యోగంలో నియమించుట, రహదారి, ఎన్ను కున్న మార్గం, ప్రజలు, సంఘం, పాతివ్రత్యము, పూలు, ఇంద్రియ సుఖాలు, పురుషత్వం, వివాహాల సంఖ్య, గుద, వ్యాపారం, విదేశ మున ఉండుట, రాయబారము, కానుకలు, రాజ్యాన్ని పడగొట్టడం, శత్రువును జయించటం, దత్తపుత్రుడు, వివాదాలు ఈ భావం వల్ల తెలుస్తాయి.

6వ భావం నుండి 2 వదిగా - శత్రువుల సంపద, ఆసుపత్రులు, జైళ్ళు, వైద్యశాలల నిర్వాహణ వల్ల లాభం
5వ భావం నుండి 3 వదిగా - ప్రియురాలు / ప్రియుని సోదరులు
4వ భావం నుండి 4 వదిగా - తల్లి ఆస్థి, ఇల్లు మారుట
3వ భావం నుండి 5 వదిగా - మేనల్లుడు, మేనకోడలు
2వ భావం నుండి 6 వదిగా - కుటుంబ కలహాలు, పారిపోయిన వాడు
12వ భావం నుండి 8 వదిగా - శత్రువుల మరణం, జరిమానాలు, ఫిర్యాదులు

11వ భావం నుండి 9 వదిగా – వ్యాపార లాభాలు, మిత్రుల antecedents

10వ భావం నుండి 10వదిగా – యుద్ధ మందు, కలహాల యందు విజయం, ఉద్యోగంనందుఉన్నత, సంఘసేవ, సాంఘిక, మానవతా projects

9వ భావం నుండి 11 వదిగా – తండ్రి యొక్క కష్టము

8వ భావం నుండి 12 వదిగా – ముద్దాయిలు, దొంగలు, పారిపోయిన వారి ఆచూకి, కస్టడీలో వుంచుట తెలుస్తాయి.

**అష్టమ భావం:** మాంగల్య బంధం, మనోబాధ, ఓటమి, అవమానం, ఆయుష్షు, పరువుపోయే విషయాలు, దోషాలు, అడ్డంకులు, బానిసలు, మరణం పొందినవారి నుండి వచ్చినదనం, వీలునామా, మరణం, భీమాలపై బోనస్‌లు, రోగగ్రస్తమైన ముఖం, రాజదండన, ధననష్టం, ప్రమాదాలు, అవయవము లేకపోవుట, అంతులేని ఆపదలు ఈ భావం వల్ల తెలుస్తాయి.

7వ భావం నుండి 2 వదిగా – కట్నం,భాగస్వాములు, కళత్రం ద్వారా ఆదాయం

6వ భావం నుండి 3 వదిగా – శత్రువుల సహచరులు వారిపై దయ చూపువారు

5వ భావం నుండి 4 వదిగా – సంతానం యొక్క చదువు, విద్యాలయాలు

4వ భావం నుండి 5 వదిగా – విద్యాసంబంధం, వ్రాతల సంబంధంగా లాభాలు

3వ భావం నుండి 6 వదిగా – సోదరుని శత్రువులు, ఋణాలు

2వ భావం నుండి 7 వదిగా – కళత్ర ధనం

12వ భావం నుండి 9 వదిగా – కుట్రదారులు, శత్రువుల పూర్వీకులు

11వ భావం నుండి 10వదిగా – ఉద్యోగమందు లాభాలు

9వ భావం నుండి 12 వదిగా – తండ్రిని ఆస్పత్రిలో జేర్చుట, లేదా రాజకీయంగా చెరసాల యందు బంధించబడుట, నిర్ణయించిన విధులు నిర్వర్తించక పోవుట తెలుస్తాయి.

**నవమ భావం :** గురువు, విదేశయానం, అదృష్టం, తండ్రి, ఉపాసన, న్యాయ సంబంధ విషయాలు, ధర్మకార్యాలు, పుణ్యం, మనుమడు, ఔదార్యం, కులీనత, తీర్థాలు, మందులు, విజ్ఞానశాస్త్రం, మనో నైర్మల్యత, విద్యయందు నేర్పు, ఐశ్వర్యం మంచి కథ, తీర్థ స్నానము, గుఱ్ఱాలు, ఏనుగులు, యుక్తి, శ్రేయస్సు, పట్టాభిషేక మందిరం, టౌన్ హాల్స్, సమావేశ మందిరాలు, ధన చలనము, మొ॥ ఈ భావం తెలుపును.

8వ భావం నుండి 2 వదిగా – గ్రంథాల విజయం, ఇన్సూరెన్స్ పాలసీల ద్వారా లాభాలు, కళత్రబంధు వర్గము

7వ భావం నుండి 3 వదిగా – భాగస్వామ్య పత్రాలు, కళత్రము యొక్క దగ్గరి ప్రయాణాలు

6వ భావం నుండి 4 వదిగా – శత్రువుల ఆస్తులు

5వ భావం నుండి 5 వదిగా – మనుమలు, మనుమరాళ్ళు, సంతానం, స్పెక్యు లేషన్ లాభాలు

4వ భావం నుండి 6 వదిగా – తల్లి ఆరోగ్యం, న్యాయపరమైన చిక్కులు, అప్పులు

3వ భావం నుండి 7 వదిగా – సోదరుని భార్య, సోదరి భర్త, సోదరులతో గొడవలు

2వ భావం నుండి 8 వదిగా – ధన నష్టం, ధనపరమైన చిక్కులు

12వ భావం నుండి 10 వదిగా - శత్రువుల కార్యకలాపాలు, మోసపూరితమైన పనులు కుట్రలు

11వ భావం నుండి 11వదిగా- మిత్రుల వ్యాపార లాభాలు

10వ భావం నుండి 12వదిగా- ఉద్యోగమందు నష్టాలు, ఖర్చులు తెలుస్తాయి

**దశమ భావం :** వాణిజ్యం, పదవి, గౌరవం, వృత్తి, విజయం, కీర్తి, ఆవేశం, మంచి ప్రవర్తన, మంచిగుణం, ఇష్టం, ఆజ్ఞ, వ్యవసాయం, కుస్తీల యందు నేర్పు, వైద్యుడు, తొడ, సుజీవనం, బోధన, ముద్రాధికారి, మొ॥ ఈ భావం తెలియజేయును.

9వ భావం నుండి 2 వదిగా - తండ్రి ఆదాయం, కుటుంబం

8వ భావం నుండి 3 వదిగా - కళత్ర కుటుంబము యొక్క చిన్న ప్రమాణాలు

7వ భావం నుండి 4 వదిగా -కళత్రము యొక్క తల్లి, ఇల్లు, చదువు

6వ భావం నుండి 5 వదిగా - సేవకుల సంతానం

5వ భావం నుండి 6 వదిగా - సంతానం యొక్క శత్రువులు, అనారోగ్యం

4వ భావం నుండి 7 వదిగా -తల్లి యొక్క సాంఘీక కార్యకలాపాలు, పబ్లిక్‌ట్రస్ట్‌లు, విద్యాలయాలు

3వ భావం నుండి 8 వదిగా - సోదరుల మృతి, వారి తదనంతరం లభించిన ధనం

2వ భావం నుండి 9 వదిగా - కుటుంబ అదృష్టం

12వ భావం నుండి 11వదిగా- జాతకుని చెడు కోరేవారి విజయం కోరేవాడు

11వ భావం నుండి 12వదిగా– మిత్రుల రహస్య శత్రువులు నష్టాలు

**ఏకాదశ భావం :** లాభాలు, భాగ్యం, కోరికలు, మనోకామన పూర్తి అగుట, జేష్ఠ భ్రాత, సోదరీ, కూతురు, ఆహ్లాదకరమైన సమాచారం, ఆధారపడటం, బంగారం, సంపద, తండ్రి వైపు ఆస్థి, ముత్యాలు, ఆభరణాలు, సకల సంపదలు, మంత్రి పదవి, గుర్తింపు, గొప్ప పేరు, వండటం, చెవి, కళలో నైపుణ్యం, పిక్కలు, విలువైన పత్రాలు మొ॥ ఈ భావం తెలియజేస్తుంది.

10వ భావం నుండి 2 వదిగా –స్వప్రయత్నం వల్ల ఆదాయం

9వ భావం నుండి 3 వదిగా – తండ్రి వైపు మేనమామలు, మేనత్తలు, పెద్దనాన్న, బాబాయలు, తండ్రి యొక్క దగ్గరి ప్రయాణాలు, తండ్రి నుండి సమాచారం.

8వ భావం నుండి 4 వదిగా – చిత్తశాంతి కోల్పోవుట, న్యాయ విద్య, రహస్య జ్ఞానం

7వ భావం నుండి 5 వదిగా – కళత్ర వ్యవహారాలు, వ్యాపార పెట్టుబడులు, లాభాలు

6వ భావం నుండి 6 వదిగా – శత్రువుల శత్రువులు, సేవకుల అనారోగ్యం అద్దెకుండే వారి అప్పులు

5వ భావం నుండి 7 వదిగా – పుత్రుని భార్య

4వ భావం నుండి 8 వదిగా – తల్లి తదనంతరం సంక్రమించిన ఆస్తులు

3వ భావం నుండి 9 వదిగా – సోదరుల విదేశ యానములు

2వ భావం నుండి 10 వదిగా –కుటుంబ గౌరవం, సాంఘీక పరిస్థితి

12వ భావం నుండి 12వదిగా – శత్రువులను నాశనం చేయటం,

ఆరోగ్యం పొందటం, నష్టాల
నుండి గట్టెక్కుట తెలుస్తాయి.

**ద్వాదశ భావం :** దుఃఖం, కాలు, ఎడమకన్ను, నష్టం, గూఢాచారీ, రహస్యాలు, షడ్ యంత్రములు, అంతం, పేదరికం, పాపం, శయనం, చెరసాల యందు బంధించిబడుట, నిద్రాభంగం, అప్పులు తీర్చుట, తండ్రి వైపు సంపద, శత్రువు, స్వర్గమునకు వెళ్ళుట, జనుల విద్వేషం, బంధనం, కారాగృహప్రాప్తి, వివాదం, శరీరపీడ, మరణం, ఇతర దేశములకు వెళ్ళుటచే మరణం, ఖర్చు, భార్యా హాని.

11వ భావం నుండి 2 వదిగా– మిత్రులతో విందుకు ఆహ్వానం
10 వ భావం నుండి 3 వదిగా–ఉద్యోగ విషయమై ప్రయాణాలు
9వ భావం నుండి 4 వదిగా –మాతామహి, పూర్వీకుల ఆస్తి, సముద్రయానం.
8వ భావం నుండి 5 వదిగా – సంతానానికి సంబంధించిన ఇన్సూరెన్సులు
7వ భావం నుండి 6 వదిగా – కళత్ర అనారోగ్యం, వైవాహిక జీవితం
6వ భావం నుండి 7 వదిగా – సేవకులతో, అద్దెకుండువారితో వివాదాలు
5వ భావం నుండి 8 వదిగా –సంతానము యొక్క మృతి, విపత్తులు ఎత్తుకొని పోవుట మొదలగునవి
4వ భావం నుండి 9 వదిగా – విదేశీ చదువు, నివాసం
3వ భావం నుండి 10 వదిగా –సోదరుల ఉద్యోగం
2వ భావం నుండి 11 వదిగా –బంధువుల కుటుంబాలు, కుటుంబ మిత్రులు

3వ భావం మొదటి తమ్ముని గూర్చి, 3వ భావం నుండి 3వది (5వ భావం) రెండవ తమ్ముని గూర్చి తలెయజేస్తాయి. అలాగే పంచమము మొదటి సంతానం గూర్చి తెలిపితే, దాని నుండి 3వ

భావం (7వ భావం) రెండో సంతానాన్ని, 9వ భావం మూడవ సంతానాన్ని తెలియజేస్తాయి. ఇలా కొద్ది ప్రయత్నం ద్వారా ఏ భావం ఏఏ బంధుత్వాల గూర్చి తెలియజేస్తుందో కనుక్కోవచ్చు. భావాలు వేటి పై ఆధిపత్యం కల్గియున్నయో తెలుస్తుంది.

పృచ్ఛకుడు, తన స్నేహితుని తప్పిపోయిన కొడుకు గూర్చి అడిగాడనుకుందాం. లగ్నం పృచ్ఛకుణ్ణి, ఏకాదశం మిత్రుని, ఏకాదశం నుండి పంచమం, అంటే తృతీయం తప్పిపోయిన బాలుని తెలుపుతాయి.

<table>
<tr><td></td><td>మేషం</td><td></td><td></td></tr>
<tr><td>లఘ్నం<br>కుంభం</td><td colspan="2" rowspan="2">చక్రం : 1</td><td></td></tr>
<tr><td></td><td></td></tr>
<tr><td>ధనస్సు</td><td></td><td></td><td></td></tr>
</table>

చక్రంలో లగ్నం కుంభం పృచ్ఛకుడు.

11వ భావం – మిత్రుడు (తప్పిపోయిన పిల్లవాని తండ్రి)

11వ భావం నుండి 5వది అంటే మేషం – తప్పిపోయిన పిల్లవాడిని సూచిస్తాయి.

లేదా ఇంతకు ముందు చెప్పినట్లు తృతీయం మిత్రుని సంతానాన్ని తెలియజేస్తుంది.

# గ్రహశీలములు

ఈ అధ్యాయములో మనము గ్రహ శీలముల గురించి తెలుసు కుందాం. మనము సాధారణముగా గ్రహాలు అను మాట వాడుతున్న ప్పటికి ప్రస్తుత మన అధ్యయనంలో తొమ్మిది గ్రహాలు మాత్రమే ముఖ్యమైనవి. అవి :

1) సూర్యుడు  2) చంద్రుడు
3) కుజుడు  4) బుధుడు
5) గురుడు  6) శుక్రుడు
7) శని  8) రాహువు
9) కేతువు

ఈ గ్రహాల యొక్క స్వభావాలు, గుణములు, ఆధిపత్యాల గురించి మనము సరైన అవగాహన పెంపొందించుకోవాలి. ప్రతి గ్రహము అనేక విధములైన లక్షణాలను కల్గివుంటుంది. ఈ గుణాలు లేదా ప్రభావాలు ఖగోళానికో భౌతిక శాస్త్రానికీ సంబంధించినవి కావు. గ్రహశీలాలు ప్రత్యేకమైన నిగూడార్థాలు కలిగినవి.

**రవి :** రాగి, బంగారము, ఇత్తడి, విలువైన వస్తువులు, తండ్రి, గుండె, జీవశక్తి అన్నివిధములైన శుభాలు, ఆత్మ, కీర్తి, దీప్తి, ధైర్యము, విజయము, ప్రభుత్వము, ప్రభుత్వ భాగస్వామ్య సంస్థల యందు ఉద్యోగము, గ్రీష్మ ఋతువు, శివుడు, అడవులు, పర్వతారోహణ, యజ్ఞ యాగాదులలో పాల్గొనుట, దేవాలయములు, వైద్యుడు, రాజు, ఋత్విజుడు, మంత్రి,పులి, లేడి,హంస, రాజాశ్ర యము, ఆయనము, కళ్ళు, భ్రమణము, కలప,శిరోవ్యాధులు, రాళ్ళు, సాంఘీక కార్యకలా పాలు, నదీతీరాలు, కెంపు, శత్రు బంధనము, లావుగా వుండేదారము కాషాయము, శత్రుత్వము, దీర్ఘకోపము, రాజసౌధములు, వైభవో పేతమైన ఇళ్ళు మొదలగు వాటి పై సూర్యునికి అధికారము కలదు.

రవి వేడి తత్వము గల శరీరము, పలుచని జుట్టు, పలుచని కనురెప్పలు, కనుబొమ్మలు, ఎర్రని మేనిఛాయ, రక్త వర్ణనేత్రాలు, ఎర్రని వస్త్రములు ధరించినవాడు, ఎముక పుష్టికలిగిన ధృడకాయుడు, ఆజానుబాహుడు.

శివాలయాలు, పొలాలు, ఎండిన భూములు, తూర్పు దిక్కు వెలుగు కలిగిన గ్రామీణ ప్రాంతాలు, మైదానాలు మొ॥ రవి సంచార స్థానాలు.

**చంద్రుడు :** తల్లి, ఆమె, సరక్షణ, మనస్సు, సముద్ర స్నానము, ఋతుపవనాలు, గొడుగులు, విసినెకర్రలు, పళ్ళు, సున్నితత్వం, పూలు, జొన్నలు, వ్యవసాయం, ముత్యాలు, కంచు, వెండి, తీపి, పాలు, దుస్తులు, నీళ్ళు, నూతులు, తటాకాలు, కుట్టు పనివారు, ఓడరేవులు, గొల్లభామలు, మంచి ఆహారము, స్వస్థత, అందం, అయ్యప్ప భక్తులు, స్త్రీలు, చాకలి, రైతులు, జలచరాలు, కుందేళ్ళు, కొంగలు, లేళ్ళు, చకోరము మొ॥వాటిపై చంద్రునకు అధికారము కలదు. చంద్రుడు పెద్దశరీరము, సన్నగాను, మంచిచాయ, అందమైన గోధుమ లేదా నీలి వర్ణము కలిగిన కళ్ళు, పలచని మెత్తనైన జుట్టు, మృదుభాషణము, తెల్లని దుస్తులు, నాజూకైన పారదర్శక రూపము కలవాడు. శ్లేష్మము, వాతతత్వము, నెమ్మదయిన స్వభావము కలవాడు, తెలివి, సుగంధాలు, దుర్గములు, బ్రాహ్మణుడు, బద్ధకము, సర్దుబాటుతనం, అపస్మారకము, ఉదరము, పుల్లదనము, చెరకు, టైఫాయిడ్, వినియోగము, వడ్డాణము, ఉప్పు, శరదృతువు, ముహుర్త కాలము, ముఖవచస్సు, గోధుమలు, పెరుగు, ప్రజలు, విదేశీ యానము, రాజచిహ్నాలు, సర్పము, పట్టు వస్త్రములు, స్పటికాలు, వంట సామాగ్రి, కత్తిపీట, మృణ్మయ పాత్రలు, మొదలైన వాటిపై చంద్రుని ఆధిపత్యం కలదు.

అమ్మవారి దేవాలయాలు, అంతఃపురాలు, వంటగదులు, స్నానాల గదులు, తటాకాలు, మూలికలు, మొక్కలు, మధ్యము నుంచు ప్రదేశాలు, అలవాట్లు, ఈశాన్య దిక్కు మొదలగునవి చంద్రగ్రహ సంచార ప్రదేశాలు.

**కుజుడు :** బలము, వీరత్వము, సోదరుడు, భూమి నుండి ఉత్పన్నమగునవి, క్రూరత్వము, అసహ్యము, ద్వేషము, అగ్ని, వంటిల్లు, బంగారము, బంధువులు, ఆయుధాలు, దొంగలు, శారీరక శక్తి సామర్థ్యాలు, అసత్యము, కలిమి, బేకరీలు, మాంస దుకాణాలు, సేనాధిపతి, ఋణాలు, రక్తస్రావము, వంటవాడు, శస్త్రధారి, కంసాలి, మేషము, కోడిపుంజు, గుంటనక్క, కోతి, గద్ద, నైతిక విలువలు కోల్పోవుట, ఎర్రని మధ్యము, శత్రువు, నగారా, మూర్ఖుడు, దుష్టమృగాలు, కోపము, విదేశీయానము, ఉష్ణము, రాజసేవ, ఆటోమొబైల్స్, యంత్రాలు, రాగి, ఖడ్గాలు, బల్లెము, కత్తులు, బాకులు, తుపాకీలు, యవ్వనము, దుర్వాసన, సమావేశ వేదిక, నిందలు, అబద్ధ ప్రచారాలు, మాంసభక్షణ, గ్రీష్మ ఋతువు, బ్రహ్మ, అటవీ అధికారి, గ్రామాధికారి, అవినీతిపరుడు, దుర్భలత్వము, దనుర్విధ్యా ప్రావీణ్యము, సామవేదము, ఇనుము, క్రూరమృగ నేతృత్వము, స్వాతంత్ర్యము, హక్కులకై పోరాటము, అశాంతి, దృఢత్వం, రక్తహీనత, వాహనారోహణ, పగడాలు, ప్రయోగశాలలు, మజ్జ గిరజాల జుట్టు, దృఢకాయము, సన్ననైన నడుము మొదలగు వాటిపై కుజుడు ఆధిపత్యం కలిగియుంటాడు. కుజునిది ఉగ్రదృష్టి, యవ్వన రూపము, పైత్యతత్వము, క్రూరత్వము, అతను ఎర్రని వస్త్రములు ధరించువాడు, ఎర్రని శరీరచాయ గలవాడు.

పాతాళము, దొంగలు, దుష్టులు దాగివుండే ప్రదేశాలు, గనులు, యుద్ధ భూములు, అగ్నివుండే ప్రదేశాలు, దక్షిణం మొదలయినవి కుజుని సంచారస్థానములు, కుమారస్వామి కుజునకు అధిదేవత.

**బుధుడు :** విద్యార్జన, వాక్కు, వకృత్వం, లలితకళా నైపుణ్యము, మేనమామ, అస్థికత్వము, బుద్ధితో గ్రహించే విషయాలు, త్యాగము, వైష్ణవారాధన, సత్యము, ముత్యపు చిప్పలు, విహారస్థలాలు, విద్యుత్ ఎలక్ట్రానిక్ విషయాలయందు నైపుణ్యము, వైజ్ఞానిక పరికరాలు, లేఖన సామాగ్రి, కలములు, వ్రాత పనిముట్లు, బంధుత్వాలు, స్నేహితులు, హాస్యం, చమత్కారము, సోదరీ సంతానం, గోపాలకుడు, పండితుడు, చేతివృత్తులవాడు, గణకుడు, విష్ణుభక్తులు, గరుడుడు, రామచిలుక, పిల్లి, గుర్రాలు, ఖజానా, గణితము, రచన, బ్రాహ్మణుడు, శూద్రుడు, పదాతి దళము, పెద్ద బంగళాలు, ఆకుపచ్చ, శిల్పము, జ్యోతిష్యము, దేవాలయము, వేదాంతం, మాతామహుడు, తండ్రివైపు బంధుత్వాలు, నపుంసకత్వము, పచ్చరాయి, బాలకుడు, వైరాగ్యము, హేమంత ఋతువు, నాభి, బహుబాషా ప్రావీణ్యత, అధర్వణ వేదం, పునరుత్పత్తి అవయవాలు, సమభావము, రత్నపరీక్షకుడు, ప్రార్థనలు, అవతారాలు, మంత్రము, యంత్రము, రాయబార కార్యాలయాలు, గుమాస్తా ఉద్యోగాలు, బిల్లులు, చర్మము మొదలగువానిపై బుధుడు అధికారము కలిగి వుంటాడు.

బుధుడు ఆకుపచ్చని చాయ, చక్కని శరీర నిర్మాణము కలిగి పైత్య, వాత, శ్లేష్మ లక్షణాలు మూడును కలవాడు ఎర్రని విశాల నేత్రములు, నరాలుపైకి కనిపించు శరీరం, ప్రియవాక్కులు, పలుకువాడు; విద్యాలయాలు, గ్రంథాలయాలు, వైష్ణవాలయాలు, ఆహ్లాదము ఉల్లాసము కలిగించు ప్రదేశాలు బుధగ్రహ సంచార స్థానాలు.

**గురుడు :** జ్ఞానము, సద్గుణాలు, సంతానము, సచీవులు, మంత్రులు, శీలము, జ్ఞానవ్యాప్తి, భారీకాయము, వేదాలు, శాస్త్రాలు, పవిత్ర గ్రంథాలఅధ్యయనము, సమృద్ధి, ప్రాయశ్చిత్తం, పెద్దలయందు, దైవము యందు, గురువుల యందు, భక్తి ప్రపత్తులు, ఖజానా,

ఇంద్రియాలు, ఇంద్రియాలను జయించుట, భర్త యొక్క సౌఖ్యము, బైరాగి, ముఖ్యులు, మతాధికారులు, పీఠాధిపతులు, పావురము, హంస, గుఱ్ఱము, స్వధర్మము, ఆవులు, పొదుపు, కార్లు, మీమాంస జ్యోతిష్యము, తాత, మనవడు, నీరువ్యాధి, అన్నయ్య, భవనము, హేమంతము,తొడలు, జాతీయస్థాయి మరియు రాచరికపు పురస్కార ములు, స్నేహితులు, వక్తృత్వ నైపుణ్యము, బలుపు, పవిత్ర జలము, ఎత్తైన సౌధాలు, తేనె, నూనె, పట్టు, పల్లకీలు, పుష్యరాగం మొదలగు వానిపై గురువుకు అధికారము కలదు.

గురువు ఐన వక్షస్థలము, ఒడ్డు, పొడుగు, లావు, బానపొట్ట పసిమిచాయ, గౌరవర్ణం కలిగిన కళ్ళు మరియు జుట్టు స్పష్టత కూడిన వాగ్ధాటి, తెలివితేటలు, ధనమునందు ఆసక్తి, శాంతస్వభా వము, శ్లేష్మతత్వము కలిగియుండును.

ఖజానాలు, నిధులు, అశ్వద్ధ, వృక్షాలు, దేవాలయాలు, చర్చి, పీఠాలు, ఈశాన్యం, పవిత్ర స్థానాలు, హేమంతము, న్యాయస్థానాలు, వస్త్రకోశము మొదలయినవి గురు సంచార స్థానములు.

**శుక్రుడు :** సంపద, వాహనాలు, వస్త్రాలు, ఆభరణాలు, భవనాలు, సంగీతం, నాట్యం, సంగీతవాయిద్యాలు, బాధ, సంతోషం, సుగంధాలు, పువ్వులు, కామప్రవృత్తి కవితలు, ఆటలు, వినోదము, ఇంద్రియసుఖలోలత్వం, సలహాదారు, మధురవాక్కు, పెళ్ళి వేడుకలు, వ్యాపారులు, నేత పనివారు, నర్తకులు, గాయకులు, వేశ్యలు, నెమలి, దున్నపోతు, చిలుక, ఆవు, ధవళవర్ణం, వెండి, వజ్రము, వైశ్యులు, అందం, మధ్యవయస్సు, సారంగి, వీణ, వేణువు, స్త్రీ వ్యామోహం, వీర్యము, సత్యము, నటన, రతిప్రావీణ్యము, సాంప్రదాయ నృత్యాలు, లక్ష్మీదేవి, క్షీణించడం, పగలు తల్లిని, రహస్య అవయవాలు, యజుర్వే దము శుక్రుని విషయములు.

శుక్రుడు అందమైన అవయవ సౌష్టవం, ఎత్తైన ఆకారము, పట్టువలె మెత్తనైన ఉంగరములు తిరిగిన ఒత్తైన జుట్టు, విశాలమైన అందమైన కళ్ళు, అనేక వర్ణములతో కూడిన వస్త్రములు ధరించు వాడు, ప్రౌఢవయస్సు, గరికె రంగు కలిగియుండును. అంతఃపురము, సినిమాలు, హోటళ్ళు, శయనమందిరాలు, నర్తనశాలలు, వేశ్యా గృహాలు, వసంత ఋతువు, ఆగ్నేయము, శుక్ర సంచార స్థానాలు.

**శని :** శని ఆధిపత్యంలో ఆయుష్షు, కర్మ, పరిణామము, భయము, పదచ్యుతి, అనారోగ్యము, పని, పనివాడు, దారిద్ర్యం, కాయకష్టం, పాపము, అపవిత్రము, విశ్వాసము, సేవాగుణము, ఇనుము, చీపుళ్ళు,వ్యవసాయ పనిముట్లు, outhouse, చెరసాల, బందీగా వుండుట, నూనె వర్తకుడు, నల్లనిరంగు, ఏనుగు, కమ్మరి, కాకి, కోయిల, నీచవర్ణము, దాసి, గాడిద, అందమైన చూపులు, కలప, పక్షులు, దుర్గుణ జీవనము, శూద్రులు, శిశిరఋతువు, అక్రమ సంతానము, నీచజన్మ, సంవత్సరము, శూద్రుడు, వైశ్యుడు, తండ్రి, దుప్పటి, జ్ఞాతి, క్రిందపడుట, నూనె, అజ్ఞానము, అధికారము, మేకలు, దున్నపోతులు, రతిసౌఖ్యమందు ఇష్టముకలవాడు, యముని పూజించువాడు, నీలం, సోడియం కలవు. శని పొడవైన సన్నని, పొడుచుకొచ్చే ఎముకలు, పళ్ళు, బిరుసైన, దట్టమైన పొట్టి జుట్టు, దట్టమైన కనుబొమ్మలు, కుంటితనము, నరములు పైకి కనిపించుట, బద్ధకము, అలసత్వము, వెన్నుపోటు స్వభావము, వాతతత్వము, నరాలపై ఆధిపత్యము కలవాడు, కఠిన హృదయము, అశుచి, రౌద్రము, కోపము, నల్లని దుస్తులు ధరించేవాడు, ముసలివాడు, నీచజనప్రదేశాలు, కూలీపని వారుండే ప్రదేశాలు, మృత్యు దేవాలయాలు, ఎడారి, పడమర, జనసంచారములేని ప్రదేశాలు, చెత్త కుండీలు, శిథిలాలు మొదలయినవి శని సంచార స్థానములు.

**రాహువు :** గొడుగులు, కుతర్కము, రాజ్యసముదాయము, క్రూర వాక్యాలు, మ్లేచ్ఛులు, దుష్టస్త్రీలు, నాస్తికత్వము, వైవిధ్యము,

పాషాణత్వం, దక్షిణం, పీడలు, కురుపులు, పగుళ్ళు, పర్వతాలు, అయోమయము, దేశబహిష్కారము, వాతము, శ్లేష్మము, దుఃఖము, తేళ్ళు, సర్పాలు, కలలకు అర్థము, మానసిక శక్తులు, మంత్రాలు, తంత్రాలు, వనదుర్గ జంతువులతో కలిసి సంచరించుట, ఆత్మహింస, స్వలింగ సంపర్కము, గాలి మొ॥ రాహువు ఆధీనములోనిది.

చీమల పుట్టలు, సొరంగాలు, శ్మశానము, సమాధులు, గుహలు, బౌద్ధులు, పాములవాడు, గాడిద, గొర్రె, తోడేలు, చీకటి, దోమలు, క్రిములు, కీటకాలు, గుడ్లగూబ మొ॥ రాహు సంచార స్థానములు, వీటితోపాటు శనికారకత్వాలపై కూడా రాహువు ఆధిపత్యం కల్గి వున్నాడు.

**కేతువు :** వైద్యుడు, కుక్క, వంటవాడు, మోక్షము, నిధి, బాధ, సంపద, దుఃఖము, అతిసున్నితత్వం, పవిత్ర నదీస్నానము, చేతబడి, తంత్రోపాసన, విజ్ఞాన శాస్త్రము, ఆత్మజ్ఞానము, మౌనము, విలాసము, అదృష్టము, శత్రువు నుండి ఇబ్బందులు, కొంచెముగా భుజించుట, వైరాగ్యము, అనాసక్తి, ఆకలి, కడుపునొప్పి, స్ఫోటకము, ఆధ్యాత్మిక సాధన, శివుని, వినాయక ఆరాధన, శూద్రుడు, చీమలపుట్టలు, కలుగు, సొరంగాలు, చీకటి, బౌద్ధులు, పాములవాడు, గాడిద, తోడేలు, పాములు కేతువు ఆధీనములోనివి వీటితోపాటు కుజ గ్రహాధిపత్యంలో ఉన్న విషయాలపై కేతువు ఆధిపత్యం కలిగి వుంటాడు.

# రాశులందు గ్రహాలు

నవగ్రహాలు తాముండు రాశి ననుసరించి, వివిధ రకాలైన ఫలితాలనిస్తూ ఉంటాయి. రాశి శీలములు, గ్రహ శీలములు కలిసి మిశ్రమ ఫలితాలను సూచిస్తాయి. ఇలా సూచించబడే ఫలితములు ఆరాశి ఏ భావమైనది అన్నదాన్ని బట్టి పృచ్ఛకుని గూర్చి లేదా ఎవరి గూర్చి ప్రశ్న వేయబడిందో ఆ వ్యక్తిని గూర్చి తెలియజేస్తాయి.

## మేషమందు గ్రహస్థితి

**సూర్యుడు :** మేషమందుండగా మధ్యస్థమైన ఎత్తు, ప్రకాశవంతమైన శరీర ఛాయ, ఎర్రటి కళ్ళు, పలుచనైన జుట్టు, గారపళ్ళు, రాజఠీవి.

**చంద్రుడు :** కొద్ది లావు, సామాన్యమైన శరీరము, మెత్తనైన పలుచని జుట్టు, పాలిపోయి నట్లుండే శరీరఛాయ, చంచల నేత్రాలు.

**కుజుడు :** చక్కని శరీర సౌష్టవము, పెద్దవైన ఎముకలు, దట్టమైన జుట్టు, దట్టమైన కను బొమ్మలు, తీక్షణమైన చూపు, ఎర్రని రూపు, ఆత్మవిశ్వాసము తొణికిసలాడుతుంది.

**బుధుడు :** మధ్యస్థమైన ఎత్తు, సాధారణమైన మేనిచాయ, అండాకార ముఖాకృతి, చురుకు తనము, చమత్కారము, టక్కరితనము కల చూపులు.

**గురుడు :** మధ్యస్తమైన ఎత్తు, పలుచని జుట్టు, కొనతేలిన ముక్కు, లావుగా నుండు శరీరము, చూపులకు అందం లేనప్పటకీ కూడా ఆహ్లాదకరమైన ప్రవృత్తిగలవారు.

**శుక్రుడు :** ఒత్తైన గిరిజాల జుట్టు, కళ్ళు పెద్దవిగా లేడికళ్ళ వలే చంచలముగా వుంటాయి. సన్ననైన శరీరము, ఆత్మ విశ్వాసము కలిగిన ఆకర్షణీయమైన రూపము.

**శని :** ఓ మాదిరి ఎత్తు, ఎండినట్లు ఉండే జుట్టు, శరీరము పై పలుచని రోమాలు, చీటికీ మాటికీ కోపం వచ్చే స్వభావము, అనారోగ్యకరమైన ప్రవర్తన.

## వృషభంలో గ్రహస్థితి

**రవి :** పొట్టిగావుండి, ఎముక పుష్టకలిగి, ముదురు రంగు. విశాలమైన చెక్కిళ్ళు, ఎక్కువ ఒత్తుకాని జుట్టు, మొండితనము, సంతము గల ప్రవృత్తి.

**చంద్రుడు :** సామాన్యమైన ఎత్తు, నిండైన బుగ్గలు సూటైన ముక్కు, సరైన ఆకృతి, మంచి శరీరఛాయ, మొండితనము.

**కుజుడు :** సాధారణమైన ఎత్తు, ఒత్తైన మోటైన జుట్టు, ముదురు రంగు ఆత్మవిశ్వాసము, పంతముతో కూడిన ప్రవృత్తి.

**బుధుడు :** మధ్యస్తమైన ఎత్తు, లావైన శరీరము, ప్రతివిషయంలో సోమరితనము, మొరటైన ప్రవర్తన.

**గురుడు :** మధ్యస్తమైన ఎత్తు, లావైన, బలమైన శరీరము, చక్కని మేనిచాయ, light eyes, గిరజాల జుట్టు, స్వేచ్ఛా ప్రియత్వం కలిగిన ప్రవృత్తి.

**శుక్రుడు :** మనోహరమైన రూపము, కాంక్షతో కూడిన కళ్ళు, మధ్యస్తమైన ఎత్తు, నిండైన ముఖము, స్నేహపూరితమైన, నిజాయితీ కలస్వభావము.

**శని :** అసహ్యాకరమైన శరీరాకృతి, సోమరితనము, నల్లని జుట్టు, గంభీరమైన భావప్రకటన, కుసంస్కారము, అలసిపోయే శరీరము.

## మిధునంలో గ్రహస్థితి

**రవి :** దృఢమైన శరీర నిర్మాణము, రక్త వర్ణ మేని ఛాయ, బట్టతల, పలుచని కనురెప్పలు, సంస్కారవంతమైన స్వభావము.

**చంద్రుడు :** మంచి, ఒడ్డు, పొడుగు, గుండ్రటి పెద్ద కళ్ళు, మంచి మేనిఛాయ, జిజ్ఞాస కలిగిన స్వభావము.

**కుజుడు :** మంచి ఎత్తు, నల్లని వర్ణము, సరియైన అవయవ నిర్మాణం, అస్థిరత్వము, చంచల స్వభావము.

**బుధుడు :** మంచి ఒడ్డు, పొడుగు కలిగిన శరీరము, సునిశితమైన చూపులు, సంభాషణా చాతుర్యము.

**గురుడు :** మధ్యస్తమైన ఎత్తైన, నిండైన శరీరము, మచ్చలు కలిగిన శరీరం రంగు, గోధుమ రంగు జుట్టు, మృదు స్వభావము.

**శుక్రుడు :** మంచి ఎత్తు, సొగసైన కళ్ళు, మంచి మేనిఛాయ, ఒత్తైన సొగసైన జుట్టు, సన్నని శరీరము, కలుపుగోలుతనము, సంస్కారము కలిగిన స్వభావము.

**శని :** పొడవైన ఆకృతి, ఒత్తైన జుట్టు, లోతైన కళ్ళు, వాడి చూపులు, వాదించు స్వభావము కలిగియుండుట.

## కర్కాటకంలో గ్రహస్థితి

**రవి :** చిన్నదైన శరీరాకృతి, లావు, జీవం లేని పలుచనైన జుట్టు, చిన్నవైన తీక్షణమైన కళ్ళు, సంతోష స్వభావము.

**చంద్రుడు :** లావు, పొట్టి, సంసార పక్షమైన ముఖం, గుండ్రని శరీరాకృతి, ఒత్తైన జుట్టు, గుండ్రటి కళ్ళు, దయ, సంస్కారము లతో కూడిన స్వభావము.

**కుజుడు :** పాలిపోయిన రంగు, చిన్న శరీరాకృతి, ఒత్తైన జుట్టు, పోట్లాడు స్వభావము, చంచలత్వము.

**బుధుడు :** చిన్న శరీర ఆకృతి, జీవంలేని జుట్టు, ముదురు రంగు అస్థిరమైన తీక్షణమైన చూపులు, సొంత ఆలోచనా సరళి కలిగిన స్వభావము.

**గురుడు :** నిండైన, సామాన్య శరీరము, అందమైన గులాబీ చెక్కిళ్ళు, గోధుమరంగు జుట్టు, ఆడంబర స్వభావము.

**శుక్రుడు :** నిండైన, మధ్యస్తమైన ఎత్తు కలిగిన శరీరము, నల్లని ఒత్తైన జుట్టు, సోమరి, కాంక్షతో కూడిన ఆకర్షణీయమైన కళ్ళు, పనికిరాని స్వభావము.

**శని :** చిన్నదైన, అవకరాలతో కూడిన శరీరాకృతి, నల్లని చాయ, జీవంలేని జుట్టు, పిచ్చి చూపులు, చెడ్డదృష్టి కలకళ్ళు.

## సింహములో గ్రహస్థితి

**రవి :** మధ్యస్థమైన ఎత్తు లేదా పొట్టి, బలమైన, సన్నని పుష్టి కలిగిన శరీరము లేత గోధుమరంగు జుట్టు, రక్త వర్ణము, గర్వము, ఠీవి గలిగిన శరీరము.

**చంద్రుడు :** పొడవైన శరీరాకృతి, గోధుమరంగు కళ్ళు, చెక్కినట్లుండే దవడలు, ఆత్మాభిమానం, సాధించాలన్న తపన కలవాడు.

**కుజుడు :** దృఢమైన శరీరాకృతి, ఎఱ్రని శరీర ఛాయ, పెద్ద

కళ్ళు, ఠీవితో కూడిన వేగవంతమైన నడక, ఉద్రేక స్వభావము, స్వేచ్ఛాప్రవృత్తి.

**బుధుడు :** గుండ్రని ముఖము, ఎత్తైన ముక్కు, సామాన్యమైన ఆకృతి, గోధుమ, రంగు కళ్ళు, దూకుడు స్వభావము.

**గురుడు :** ఎత్తైన, చక్కనైన శరీర సౌష్ఠవం, లావైన శరీరము, గిరజాల జుట్టు, ఎర్రని ఛాయ, గర్వము, దానగుణము.

**శుక్రుడు :** మంచి ఛాయ, గుండ్రని ముఖం, చక్కని కళ్ళు, ఒత్తైన జుట్టు, ఎత్తైన, పొందికైన శరీరాకృతి, కోపము, దయ కలిగిన స్వభావము.

**శని :** పెద్దవైన ఎముకలు, ఎత్తైన రూపు, పలుచని జుట్టు, దట్టమైన, ఒతైన కనుబొమ్మలు, గంభీరమైన స్వభావము.

## కన్యలో గ్రహస్థితి

**రవి** : సన్నని పొడవైన శరీరము, ఒత్తైన నల్లని జుట్టు, శాంతము ఇతరులు మెచ్చే స్వభావం.

**చంద్రుడు :** మధ్యస్థమైన శరీర ఆకృతి, నల్లని ఛాయ, గంభీరము, చాతుర్యము, దూసుకు వెళ్ళే స్వభావం కలవారు.

**కుజుడు :** చక్కని మధ్యస్థమైన శరీరాకృతి, నల్లని ఒత్తైన జుట్టు, ఎర్రని మేనిఛాయ, ఉత్సాహభరితమైన, సమర్థవంతమైన స్వభావము కలవాడు.

**బుధుడు :** ఎత్తైన శరీరము, కళ్ళల్లో మెరుపు, చురుకుదనము, చమత్కారము ఉంటాయి. ఒతైన జుట్టు, పొందికైన అవయవాలు.

**గురుడు :** లావైన, భారీ కాయము, సాధారణమైన ఛాయ,

దూసుకుపోయే స్వభావం, సాధించాలన్న తపన, కష్టపడే తత్వం గలవారు.

**శుక్రుడు :** ముదురు రంగుఛాయ, అండాకార ముఖాకృతి, మెరిసే కళ్ళు, తెలివైన, టక్కరి స్వభావము. వీరు అంత అదృష్టవంతులు కారు.

**శని :** చాలా పొడవైన శరీరము, నల్లని జుట్టు, విషాదం నిండిన కళ్ళు, పొడవైన ముఖము, మందబుద్ధి, ఒంటరితనం.

## తులలో గ్రహస్థితులు

**రవి :** పొడవైన, సన్ననైన శరీరము, పాలిపోయి నట్లుండు చాయ, పలుచని జుట్టు, శిష్ట వ్యవహారము, సుశీలత.

**చంద్రుడు :** ఆకర్షణీయమైన నిండైన ముఖ కవళికలు, మెరిసే శరీరఛాయ, సరదాగా, హాస్యప్రియుడుగా ఉంటాడు.

**కుజుడు :** చక్కని శరీరము, ఎర్రని శరీర ఛాయ, పలుచని జుట్టు, ఆనందముగాను, రహస్యప్రవర్తన కలిగియుందును.

**బుధుడు :** సామాన్యమైన ఎత్తు, పొందికైన ఎముకలు, లేత రంగుకళ్ళు, ఓ మాదిరి ఒత్తైన జుట్టు, వక్తృత్వం, వినయం కలవారు.

**గురుడు :** పొడవైన శరీర ఆకృతి, మచ్చలతో కూడిన చక్కని ఛాయ, నిండైన లావైన బుగ్గలు, అవయవాలు, నిదానస్తుడు, గెలిచే స్వభావము కలవాడు.

**శుక్రుడు :** అండాకార ముఖము, లోతైన, గోధుమరంగు లేదా నల్లని కళ్ళు, ఒత్తైన మెరిసే జుట్టు, ముడతలు పడ్డ ముఖము, పొడవైన, ఆకర్షణీయమైన శరీరాకృతి, ఉత్సాహము, ఆహ్లాదము కలిసిన స్వభావము.

**శని :** మధ్యస్తమైన ఎత్తు, ఒత్తైన నల్లని జుట్టు, ఎత్తైన నుదురు, వీరి ప్రవర్తన అర్థంకానిది, శాంతం.

## వృశ్చికంలో గ్రహస్థితి

**రవి :** చిన్నవి, ముదురు రంగు కల్గిన కళ్ళు, వయసుతో పాటు పలుచబడు ఒత్తైన కనుబొమ్మలు, నల్లని వర్ణము, గట్టి నిర్ణయాలు తీసుకోగలవారు.

**చంద్రుడు :** లావైన పొట్టి శరీరాకృతి, ఒత్తైన జుట్టు, పీలవమైన రంగు, అనారోగ్యకరమైన ఆలోచనలు చేయు స్వభావము.

**కుజుడు :** శుష్కించిన కండలు తిరిగిన శరీరము, బూరిబుగ్గలు, ఎర్రని ఛాయ, ఒత్తైన గిరజాల జుట్టు, క్రోధము, ప్రతీకారము, కల్పనా చతురత కలిగియుండును.

**బుధుడు :** సామాన్యమైన ఎత్తు, విశాలమైన భుజములు, ఓ మాదిరి గిరజాల జుట్టు, సాధారణమైన రంగు, కపటత్వం, మోసము, పోట్లాడేతత్వం గలవారు.

**గురుడు :** లావు, పొట్టి, పుష్టిగల శరీరము, జీవం లేని కళ్ళు, పాలిపోయిన రంగు, స్వార్థము, ఆడంబరము కలిగియుండు వారు.

**శుక్రుడు :** లావైన భోగాసక్తి గల శరీరం, నల్లనిజుట్టు, గర్వము, కోరిక గల కన్నులు, అసూయ నిండిన పశుప్రవృత్తి, అనుమానం కలిగియుంటారు.

**శని :** పొట్టి శరీరం, నల్లని ఛాయ, బాగా వంపులు తిరిగిన జీవం లేని జుట్టు పెద్దవైన భుజాలు, క్రోధప్రవృతి కలిగి యుంటారు.

## ధనస్సులో గ్రహస్థితి

**రవి :** ఎత్తు, అందమైన, పలచని గోధుమరంగు జుట్టు, మంచిరంగు, సాధించాలన్న తపన, తత్వదృష్టి కలిగియుంటారు.

**చంద్రుడు :** ఆకర్షణీయమైన రూపం, పొందికైన అవయవాలు, చర్మం పై మెరుపు, తొందర ఎక్కువ సాధించాలన్న పట్టుదల, దయా ప్రవృత్తి కలిగియుంటాడు.

**కుజుడు :** పొడవు, చక్కని శరీర నిర్మాణం, లోతైన చురుకైన కళ్ళు, గోధుమ రంగు జుట్టు, స్వాతంత్ర్యం, తొందరగల స్వభావం.

**బుధుడు :** చక్కని పొడవు, పొందికైన చక్కని శరీర సౌష్టవం, ఆకర్షణీయమైన శరీర ఛాయ, ముడుతలేని చర్మం, లేతరంగు కళ్ళు, ముక్కు గ్రద్ద ముక్కులా వుంటుంది. తొందరపాటు, మోటు స్వభావం, కోపం వచ్చినప్పటికి తొందరగా మెత్తబడి పోతారు.

**గురుడు :** చక్కని ఆరోగ్యం మంచి ఒడ్డు, పొడుగుగా ఉంటారు. ఎర్రని శరీరఛాయ, పెద్దకళ్ళు, దయా స్వభావం, మంచి స్నేహంగా ఉంటారు.

**శుక్రుడు :** ఎత్తు, అందంగా కన్పించు శరీరం, ఒత్తైన జుట్టు, కాంతివంతమైన నల్లని కళ్ళు, ఉద్రేక స్వభావం, ఉపకారం చేసే తత్వం.

**శని :** పెద్దదైన శరీర నిర్మాణం, ఎముకలు కన్పిస్తూ ఉంటాయి. మంచి రంగు, గంభీరమైన దయగల చూపులు, సానుభూతి, సహాయం చేయు తత్వం.

## మకరంలో గ్రహస్థితి

**రవి :** మధ్యస్థమైన ఎత్తు, సన్నని శరీరం, పలుచని జుట్టు, కాంతిలేని ఛాయ, గౌరవించదగిన, ఆహ్లాదకరమైన ప్రవృత్తి.

**చంద్రుడు :** పొట్టిగా, బక్కగా ఉంటారు. బలహీనం. ముఖంలో విషాదం, కాంతి లేని కళ్ళు, సన్నని మెడ, నల్లని జుట్టు, మోసం, నమ్మదగని, అవినీతికరమైన ప్రవర్తన.

**కుజుడు :** ఒత్తైన నల్లని జుట్టు, చిన్న శరీరం, సాధించాలన్న పట్టుదల, చురుకుదనం.

**బుధుడు :** చిన్నదైన సామాన్యంగా ఉండే శరీరం, తీక్షణమైన, అనుమానస్పదమైన కళ్ళు సంకుచిత స్వభావం, మోసం, టక్కరితనం.

**గురుడు :** చిన్న శరీరం, లేత పసుపుపచ్చ రంగు ఛాయ, లేతరంగు కళ్ళు, శరీరం మీద ముఖం మీద జుట్టు పలుచగా ఉంటుంది. చిరాకు, అసంతృప్తి నిరుత్సాహం.

**శుక్రుడు :** మధ్యస్థమైన ఎత్తు, పాలిపోయిన ఛాయ, నల్లని కళ్ళు, సోమరి, సాధించాలన్న తపన, విలాసాల యందు ఇష్టం.

**శని :** సన్నగా, ఎముకలు కన్పిస్తూ ఉంటారు. నల్లని జుట్టు బిరుసుగా ఉంటుంది. చిన్న కళ్లు, చొచ్చుకొని పోయే చూపులు, లోభం, అసంతృప్తి.

## కుంభంలో గ్రహస్థితి

**రవి :** మధ్యస్థమైన, సామాన్యమైన శరీరం, కొద్దిగా లావుగా ఉంటారు. గుండ్రని కళ్ళు, స్వచ్ఛమైన శరీర ఛాయ, పలుచని జుట్టు, సాధించాలన్న పట్టుదల, జీవితంలోని అన్ని విషయాలపై అధికారం చెలాయించాలని చూస్తారు.

**చంద్రుడు :** మంచి నిర్మాణం, మధ్యస్థమైన ఎత్తు కలిగిన శరీరం, గోధుమరంగు పెద్దకళ్ళు, పలుచని జుట్టు, శరీరంపై ఎక్కువ జుట్టు ఉంటుంది. స్నేహ స్వభావం, చక్కని ఆలోచన, నిపుణత.

**కుజుడు :** ఎత్తు, మంచి సౌష్టవం, ఎర్రని ఛాయ, గరుకైన జుట్టు, అలుపెరగని ఆత్మవిశ్వాసం, మంచి ప్రవృత్తి.

**బుధుడు :** మధ్యస్థమైన ఎత్తు, సామాన్యమైన శరీరం, నిండైనముఖం, మంచి స్నేహాన్ని చూపించే కళ్ళు, మానవత్వం, సంతోషపరచు, దయాస్వభావం.

**గురుడు :** లావుగా మధ్యస్థమైన ఎత్తు, మంచి ఛాయ, ఒకమాదిరి ఒత్తైన నల్లని జుట్టు, సహాయకారి, చురుకుగా, సరదాగా ఉంటారు.

**శుక్రుడు :** అందమైన శరీరం, చక్కని ఛాయ, మెత్తనైన గోధుమరంగు జుట్టు, మంచి గౌరవం, ఇతరుల కష్టనష్టాలలో పాలు పంచుకునే వారు.

**శని :** మధ్యస్థమైన ఎత్తు, నల్లని జుట్టు, లోతైన, తీక్షణమైన కళ్ళు, హుందాగా నిగ్రహం కల్గి ఉంటారు. మంచితనం, నైపుణ్యం కల్గియుంటారు.

## మీనంలో గ్రహస్థితి

**రవి :** మధ్యస్థమైన ఎత్తు, బాగా లావుగా ఉంటారు. మంచి ఛాయ, మంచి స్వభావం, దూబారా చేసే స్వభావం. ముఖం, భుజాలు గుండ్రంగా ఉంటాయి.

**చంద్రుడు :** లావు, అనాకరిత్వం, మంచికళ్ళు, నిండైన బుగ్గలు, పెదవులు మందం, బద్ధకం, దయాస్వభావం.

**కుజుడు :** లావు, మధ్యస్థమైన ఎత్తు, పాలిపోయిన ఛాయ, చంచల నేత్రాలు చపలత్వం, సోమరితనం, చెడ్డ అలవాట్లు.

**బుధుడు :** వికారమైన రూపం, ఈడుస్తూ నడవటం, నీరసంగా ఉండే కళ్ళు, పలుచని కాంతిలేని జుట్టు, రహస్య

ప్రవృత్తి, మాటకారితనం, స్త్రీలకు మధ్యమునకు బానిస.

**గురుడు :** మధ్యస్థమైన ఎత్తు, కొంచెం చూడచక్కగా వుంటారు. నల్లని జుట్టు కష్టపడే తత్వం, సాధించాలన్న పట్టుదల, భోగాశక్తి.

**శుక్రుడు :** సామాన్యమైన శరీర నిర్మాణం, మోహం లావుగా ఉంటుంది. ఆకర్షణీయమైన కళ్ళు, బుగ్గలు, అందమైన పెదవులు, కాంతిగల శరీర ఛాయ ప్రశాంతమైన, నెమ్మదైన ధర్మబద్ధమైన స్వభావం.

**శని :** మధ్యస్థమైన ఎత్తు, పెద్ద ఎముకలు కల్గిన అవయవాలు, కళ్ళు చిన్నవి, నమ్మలేము, ద్రోహం.

లగ్నం, లగ్నంలో ఉన్న గ్రహాలు, చూసే గ్రహాలు, లగ్నాధిపతి ఉన్నరాశి పృచ్ఛకుడ్ని తెలియజేస్తాయి. ప్రశ్న ఎవర్ని గూర్చి వేయబడిందో, వార్ని సూచించే రాశి, రాశినాధుడు ఈ రెంటి పై ప్రభావం చూపు గ్రహాలు ఆ వ్యక్తిని గూర్చి చెప్పుతాయి.